

# తెలుగు భారతి

F

## నాలుగవ తరగతి వాచకం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే
ఉచిత పంపిణీ

ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాద్

Jai Sri Rama

# తెలుగు భారతి

నాలుగవ తరగతి వాచకం

ప్రధాన సంపాదక మండలి :

అధ్యక్షులు : ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు

ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి

చిత్రకారుడు :

ఎ.వి.బి.ఎస్. ఆనంద్



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ

హైదరాబాదు

SPP

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

New Impressions 1999, 2000, 2001, 2002, 2003, 2004, 2005, 2006, 2007



This book has been printed on
60 GSM HPC White Printing Paper
and 140 GSM (HPC) White Cover Paper (MF)

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

Printed in India
at Saraswati Printing Press, Noida, U.P.
for The Director, A.P. Govt. Text Book Press,
Mint Compound Hyderabad, Andra Pradesh.

# ముందుమాట

2002సం. నాటికి 6 - 11 సం. పిల్లలందరికి విద్యను అందించాలనే మహత్తర ఆశయంతో జిల్లా ప్రాథమిక విద్యా కార్యక్రమం (డి.పి. ఇ.పి.) మనరాష్ట్రంలో కొనసాగుతోంది. పిల్లలకు గుణాత్మక విద్యను అందించడం ద్వారా వారి స్థాయిని పెంచడమనేది డి.పి. ఇ.పి. లక్ష్యాలలో చాలా ముఖ్యమైనది. దీనిలో భాగంగా ఈ వాచక రూపకల్పన జరిగింది.

భాష భావ వ్యక్తీకరణకు, భావ గ్రహణకు తోడ్పడే సాధనం. పిల్లలు స్వేచ్ఛగా తమ భావాలను, ఆలోచనలను, అనుభూతులను, అనుభవాలను ఇతరులకు అర్థమయ్యే రీతిలో స్పష్టంగా, దోషరహితంగా చెప్పగలగాలి. అట్లాగే ఎదుటి వారు తెలియపరిచే విషయాలను సరియైన రీతిలోఅవగాహన చేసుకోగలగాలి. పిల్లలు ఆసక్తితో, తమకోసం తాము అభ్యసన ప్రక్రియలలో పాల్గొనడం ద్వారా మాత్రమే మనం కోరుకునే స్థాయిని సాధించగలం.

పిల్లలు పాఠ్యపుస్తకాన్ని తమకు ఇష్టమైనదిగా భావించి, ఉపయోగించాలి. వారిలో పఠనాశక్తిని పెంపొందించడానికి ఆసక్తి కల్గించే చిత్రాలతో, సులభమైన ఆటలు, పాటలు, కథలు మొదలయిన వాటిని పాఠ్యాంశాలుగా ఈ వాచకంలో పొందు పరచడం జరిగింది.

పాఠాల కింద ఇచ్చిన అంశాలు పిల్లలను ఆలోచింపచేసేవిగా, ఆసక్తి కల్గించేవిగా ఉండి తమ ఊహలను, అనుభూతులను స్వేచ్ఛగా తెలియపరచడానికి వీలుగా ఉన్నాయి. శ్రవణ, భాషణ, పఠన, లేఖన నైపుణ్యాలతో పాటు కల్పనా శక్తిని, సృజనాత్మకతను పెంపొందించటానికి వీలుగా తయారు చేయడం జరిగింది.

ఎంత మంచి పాఠ్యపుస్తకమైనా ఉపాధ్యాయునికి దీటురాదు. ఉపాధ్యాయుడు పిల్లలు తమంతట తాముగా నేర్చుకోవడానికి సహజవాతావరణాన్ని కల్పించి మంచి ఫలితాలు పొందవచ్చును.

పిల్లలకిష్టమైన రీతిలో వాచకాన్ని రూపొందించడానికి జరిగిన ఈ ప్రయత్నాన్ని ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, విద్యాభిమానులు సాదరంగా స్వీకరిస్తారని ఆశిస్తూ, తగిన సలహాలు, సూచనలు అందజేయగలరని కోరుతున్నాం.

# వాచకాన్ని రూపొందించినవారు.

ప్రశిక్షకులు

డా డి. చంద్రశేఖర రెడ్డి : రీడర్, ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాచ్య కళాశాల, హైదరాబాదు.

శ్రీ జి. వెంకట స్వామి (రిటైర్డ్) : ఉపన్యాసకులు, యస్. సి.. ఇ. ఆర్. టి, హైదరాబాదు.

శ్రీమతి డి. రమాదేవి : ఉపన్యాసకులు, యస్. సి.ఇ. ఆర్. టి., హైదరాబాదు.

శ్రీ యస్. బి. జె. ఆర్. చౌదరి : ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ, బోయపాలెం, గుంటూరు

శ్రీ కుందా భాస్కర రావు : ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ, బోయపాలెం, గుంటూరు

శ్రీయం. జె. పురుషోత్తం నాయుడు: ఉపన్యాసకులు, జిల్లా విద్యా శిక్షణా సంస్థ, కార్వేటి నగరం, చిత్తూరు

శ్రీ ఖండేరావు రమేష్ రావు : మండల రిసోర్స్ పర్సన్ & స్టేట్ రిసోర్స్ గ్రూపు సభ్యులు, డి.పి.ఇ.పి. కరీంనగర్ జిల్లా

శ్రీ దీవి రంగాచార్యులు (రిటైర్డ్): ఉపాధ్యాయులు, జె.వి. ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల, స్వర్ణ, ప్రకాశం జిల్లా.

శ్రీ ముదిగొండ శాస్త్రి : ఉపాధ్యాయులు, ఎస్. ఎఫ్. ప్రాథమిక ఉన్నత పాఠశాల, ఎలకుర్రు, కృష్ణా జిల్లా.

శ్రీ టి. కుమార స్వామి శెట్టి : ఉపాధ్యాయులు, ఖాజీ మున్సిపల్ స్కూలు, రాములవారి గుడి వీధి, చిత్తూరు, చిత్తూరు జిల్లా.

శ్రీమతి ఎస్.పి. విజయమ్మ : ఉపాధ్యాయిని, మండల పరిషత్ ప్రాథమిక పాఠశాల, చిన్న పప్పూరు, పెద్ద పప్పూరు మండలం, అనంతపురం జిల్లా.

శ్రీమతి టి. శాంతాదేవి : ఉపాధ్యాయిని, మండల పరిషత్ ప్రాథమిక పాఠ, తూగుండ్రం, జీ.డి. నెల్లూరు మండలం, చిత్తూరు జిల్లా.

## ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం

## అభ్యసన సూత్రాలు

అ. ఉపాధ్యాయులు రూపొందించిన అభ్యసన ప్రక్రియలను కల్పించటం.

ఆ. క్రియలు, అన్వేషణ, ప్రయోగాల ద్వారా అభ్యసనాన్ని అభివృద్ధి పరచటం.

ఇ. వ్యక్తిగత, జట్టు, పూర్తి తరగతి పనిని అభివృద్ధి పరచటం.

ఈ. వైయక్తిక భేదాలకు తగిన అభ్యసనాన్ని కల్పించటం.

ఉ. స్థానిక పరిసరాలను వినియోగించటం.

ఊ. విద్యార్థుల పనిని ప్రదర్శించి, చక్కగా నిర్వహించటం ద్వారా ఆసక్తికరమైన తరగతిగదిని రూపొందించటం.



ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

# వందే మాతరం

– బంకించంద్ర ఛటర్జీ

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం ; వందేమాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం వందేమాతరం.

### భావం

భారతమాతకు వందనం, తియ్యని నీటితో, కమ్మని పండ్లతో, చల్లని గాలులతో, పచ్చని పైర్లతో విలసిల్లే భారతమాతకు వందనం. రాత్రులు తెల్లని వెన్నెలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ స్వచ్ఛమైన నవ్వులతో మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం.

### ఉపాధ్యాయులకు సూచన

స్వాతంత్ర్య సమరంలో వందేమాతరం గీతం యావద్భారత దేశాన్నీ ఉర్రూతలూగించింది. దీన్ని స్వాతంత్ర్య విప్లవగీతంగా భారతీయులందరూ గానం చేశారు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా సింహగర్జనలా మారుమోగింది. దేశభక్తికీ, స్వాతంత్ర్య పిపాసకూ ఈ గీతం ప్రతీకగా నిలచింది. ఈ గీతం బంకించంద్ర ఛటర్జీ రాసిన "ఆనంద్ మఠ్" నవలలోనిది. ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పాలి.

# మా తెలుగు తల్లి

– శంకరంబాడి సుందరాచారి



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!

ఉపాధ్యాయులకు సూచన:
ఈ గీతాన్ని విద్యార్థులకు భావానుగుణంగా పాడడం నేర్పండి.
సభలు - సమావేశాల మొదట పాడించండి.

# సారే జహాఁసె అచ్ఛా

- మహ్మద్ ఇఖ్బాల్

సారే జహాఁసె అచ్ఛా హిందూస్తాఁ హమారా
హమ్ బుల్ బులేఁహై ఇస్‌కే, యే గుల్ సితాఁ హమార హమారా ॥

పరబత్ వో సబ్ సే ఊంఛా హమ్‌సాయా ఆస్మాఁ కా
వో సంతరీ హమారా ! వో పాస్‌బాఁ హమార హమారా ॥

గోదీమె ఖేల్‌తీహైఁ ఇస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్‌షన్‌హై జిన్ కే దమ్‌సే రష్ కే జినాఁ హమార హమారా ॥

మజ్-హబ్ నహీఁ సిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హైఁ హమ్, హిందీ హైఁ హమ్
హిందీ హైఁ హమ్, వతన్ హై హిందుస్తాఁ హమార హమారా ॥

భావం:

ప్రపంచంలోకెల్లా మన భారతదేశం ఉత్తమమైంది. ఇది మనకో ఉద్యానవనం. మనమిక్కడ బుల్ బుల్ పిట్టలం. ఆకాశాన్నంటే ఆ మహోన్నత పర్వతం ఆ పక్కన మనకు కాపలాగా రక్షణగా నిలచి ఉంది. ఈ దేశమాత ఒడిలో వేలాది నదులు ఆడుకుంటున్నాయి. ఈ నదీ జలాలతో వికసించిన పూదోటను చూసి స్వర్గమే అసూయ పడుతున్నది. మతం, పరస్పర వైరాన్ని బోధించదు. మనమంతా భారతీయులం. మనదేశం భారతదేశం.

ఉపాధ్యాయులకు సూచన:

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి.

# జాతీయ గీతం

- రవీంద్రనాథ్ ఠాగూరు

జనగణమన అధినాయక జయహే!
భారత భాగ్య విధాతా!
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ!
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛల జలధితరంగ!
తవ శుభనామే జాగే!
తవ శుభ ఆశిష మాగే!
గాహే తవ జయ గాథా!
జనగణ మంగళదాయక జయహే
భారత భాగ్యవిధాతా!
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ జయహే!

**భావం:**

జనులందరి మనస్సులకూ అధినేతవూ, భారత భాగ్య విధాతవూ అయిన నీకు జయమగుగాక. పంజాబు, సింధు, గుజరాత్, మహారాష్ట్ర, ద్రావిడం, ఉత్కళ, వంగ దేశాలతోను, వింధ్య హిమాలయ పర్వతాలతోను, యమునా, గంగాప్రవాహాలతో ఉవ్వెత్తుగా లేచే సముద్ర తరంగాలతోను శోభించే ఓ భారత భాగ్యవిధాతా! వాటికి నీ శుభనామం ఉద్బోధ కలిగిస్తుంది. అవి నీ ఆశీస్సులు అర్థిస్తాయి. నీ జయగాథల్ని గానం చేస్తాయి. సమస్త జనులకు మంగళ ప్రదాతవూ, భారత భాగ్యవిధాతవూ అయిన నీకు జయమగుగాక! జయమగుగాక! జయమగుగాక!

**ఒక వివరణ :**

ఈ గీతం అవిభక్త భారతదేశంలోని రాష్ట్రాలను సూచిస్తుంది. సింధు ప్రాంతం ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉంది. మరాఠా అంటే మహారాష్ట్రం. ద్రావిడ అంటే తమిళ, ఆంధ్ర, కర్ణాటక, కేరళ ప్రాంతాలు. ఉత్కళ అంటే ఒరిస్సా. వంగ అంటే ఇప్పటి పశ్చిమబెంగాలు.

# ప్రతిజ్ఞ

భారతదేశం నా మాతృభూమి.
భారతీయులందరూ నా సహోదరులు.

నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను.
సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ
వారసత్వ సంపద నాకు గర్వకారణం.
దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను
కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని,
పెద్దలందర్ని గౌరవిస్తాను.

ప్రతివారితోను మర్యాదగా నడచుకొంటాను.
నా దేశంపట్ల, నా ప్రజల పట్ల సేవానిరతితో
ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

# విషయసూచిక

# 1. సాధిస్తాం !



తెలుగు తల్లి బిడ్డలం !
వెలుగు నింపు దివ్వెలం !!

చేయి చేయి కలుపుతాం
చెలిమితోడ మెలగుతాం
జాతి గీతి పాడుతాం
చదువులన్ని చదువుతాం !

శ్రమ శిక్షణ పాటిస్తాం
శ్రమదానం సాగిస్తాం
పరిశుభ్రతను పాటిస్తాం
ప్రగతి బాట పయనిస్తాం !

చక్కటి పాదులు చేసేస్తాం
మొక్కలు ఎన్నో నాటేస్తాం
పచ్చదనాన్నే తెచ్చేస్తాం
ప్రకృతి అందం పెంచేస్తాం

స్నేహ సుధలనే చిందిస్తాం
శాంతిని మేమూ పంచిస్తాం
ఆదర్శంగా జీవిస్తాం
అందరమొకటై సాధిస్తాం !

తెలుగు తల్లి బిడ్డలం !
వెలుగు నింపు దివ్వెలం !!



# 2. అనుకున్నదొకటి అయినదొకటి













కథ చెప్పండి -

రాయండి.



# 3. ఉపాయం

అంజమ్మ, కపిలయ్య భార్యాభర్తలు. వాళ్లకి ఇద్దరు పిల్లలు. ఒక రోజు సాయంకాలం వారు తమ బంధువుల ఇంటికి బయలు దేరారు. దారిలో చీకటి పడింది. ఆ రాత్రి ఎక్కడో ఒకచోట గడిపి, తెల్లవారి బయలుదేరాలని అనుకున్నారు. సరైన స్థలం కోసం వెతికారు. ఇంతలో ఒక గుహ కనిపించింది. లోపలకి వెళ్లారు. అక్కడ జంతువుల ఎముకలు కనిపించాయి. అంజమ్మ, "అమ్మో! ఇది సింగమయ్య ఇల్లులా ఉంది. ఆయన మనల్ని చూస్తే పట్టి చంపి తింటాడు" అంది. పిల్లలిద్దరు భయంతో గజగజ వణికి పోయారు. "ఇప్పుడు చీకట్లో ఎక్కడికని వెళ్తాం ? సింగమయ్య లేడు



కదా! వచ్చాక చూద్దాం " అన్నాడు కపిలయ్య.

సింగమయ్య కుందేలు మాంసం తిని నెమ్మదిగా తన ఇంటికి బయలుదేరాడు. దూరంనుంచే సింగమయ్య రాకను అంజమ్మ గమనించింది. కపిలయ్యకు చెప్పింది. అతను ఆమె చెవిలో గుసగుసలాడాడు. ఆమె దబదబా పిల్లలిద్దరి వీపులపై రెండు దెబ్బలు వేసింది. వారు ఏడుపు లంకించుకున్నారు. " పిల్లలెందుకు ఏడుస్తున్నారు ? " సింగమయ్య వినేలా బిగ్గరగా అడిగాడు కపిలయ్య. "పిల్లలు మాంసం కావాలని ఏడుస్తున్నారు. " గట్టిగా జవాబిచ్చింది అంజమ్మ. " అందుకోసమేకదా !. మనం ఇక్కడికి వచ్చింది ! సింహం వచ్చే వేళయింది. వచ్చాక చంపి కడుపునిండా తిందురు గాని" అని కపిలయ్య గంభీరంగా అన్నాడు.

కపిలయ్య మాటలు విని సింగమయ్య హడలెత్తి పోయాడు. భయంతో పరుగు లంకించుకున్నాడు. దారిలో చింతచెట్టు కింద చిరుతయ్య కలిశాడు. "ఎందుకు పరుగెత్తు తున్నావు" అని అడిగాడు. సింగమయ్య సంగతంతా చెప్పాడు. " మీ ఇంట్లో ఉన్నది కపిలయ్య కుటుంబం. వాళ్ళు మీ ఇంట్లోకి వెళ్తుండడం నేను చూశాను" పకపకా నవ్వుతూ అన్నాడు చిరుతయ్య. అనుమానంగా చూశాడు సింగమయ్య. "ఒట్టు ! అది కచ్చితంగా కపిలయ్య కుటుంబమే ! నా కళ్లారా చూశాను" అన్నాడు చిరుతయ్య. అయినా సింగమయ్యకు నమ్మకం కలగలేదు. "అయితే మనిద్దరం తోకలు ముడివేసుకుని కలిసి వెళ్దాం. తుంటరి కపిలయ్య పని పడదాం" అని చిరుతయ్య అన్నాడు. "సరే" అన్నాడు సింగమయ్య.

ఇద్దరూ తోకలతో పీటముడి వేసుకుని, గుహవైపు వెళ్లారు. దూరం నుంచి కపిలయ్య వీరిని చూశాడు. భార్యకు సైగ చేశాడు. ఆమె మళ్లీ పిల్లలని దబదబ బాదింది. వారికి ఏమీ అర్థంకాక బిగ్గరగా ఏడ్చారు. "ఏడుపు ఆపండి ! సింహానికి మాయ మాటలు చెప్పి తీసుకు రమ్మని చిరుతయ్యను పంపాను. రాగానే చంపి తిందురు గాని", కోపంగా కపిలయ్య అన్నాడు. సింగమయ్య అనుమానం బలపడింది. భయంతో తారెత్తిపోయి పరుగు తీశాడు. రాళ్లూరప్పల్లో, ముళ్ల తుప్పల్లో పడుతూలేస్తూ ఒకటే పరుగు. పరుగే పరుగు !

పాపం చిరుతయ్య తోక తెగిపోయింది. సింగమయ్యకు ఎడాపెడా .దెబ్బలు తగిలాయి. పళ్ళు మొత్తం ఊడిపోయాయి. డాక్టర్ కొంగన్న మంచి మందులు ఇచ్చినా, కోలుకోవడానికి కొన్ని నెలలు పట్టింది.

# 4. స్వేచ్ఛ



అన్నయ్య తెచ్చాడు
చిన్నికొక చిలుక
చిన్నితన గారాల
చెల్లాయి కనుక!

చిన్నపంజర మొకటి
చేయించి అందు
చిన్నారి చిన్ని, తన
చిలుక నుంచింది.

ఒకరోజు అమ్మాయి
ద్రాక్ష కొని తెచ్చింది
ప్రేమతో తన చిలుక
నోటి కందించింది.

నీకేమి తెలుసులే
చిన్ని నాబాధ?
పండ్లతో నాబాధ
బాపలేవమ్మ!

స్వేచ్ఛగా నింగిలో
సంచరిస్తుంటే
దాని కన్నా సుఖము
నాకెక్కడుంది ?

పచ్చ పచ్చని చెట్ల
పచ్చరంగులతో
కలిసి పోతే మనసు
తేలి పోతుంది.

బంగారు పంజరమే
బందిఖానా నాకు
స్వేచ్ఛలేకున్నపుడు
సుఖమెక్కడుంది ?

అని చిలుక బాధతో
కన్నీరు కార్చింది.
అది చూసి పాపాయి
గుండె కరిగింది.

దయదలచి పంజరపు
తలుపు తెరిచింది
చిలకమ్మ తుర్రుమని
ఎగిరి పోయింది.



– కలువకొలను సదానంద.

## ఇవి చేయండి

అ మీకు తెలిసిన పక్షుల పేర్లు చెప్పండి./ రాయండి.

| | | |
|---|---|---|
| కాకి | .................. | .................. |
| పావురం | .................. | .................. |
| | .................. | .................. |

ఆ కింది ఆధారాలతో ‘ తి ’ తో అంతమయ్యే పదాలను పూరించండి.

| | | | |
|---|---|---|---|
| ఉదా ॥ | బుద్ధిమంతుడు | = | సుమతి |
| | వెలుగు | = | .......... |
| | ప్రపంచం | = | .......... |
| | ఆటకు ఉపయోగిస్తారు | = | .......... |
| | విధం | = | .......... |



భారత ప్రధాని ఐ.కె. గుజ్రాల్ నుండి అవార్డు అందుకుంటున్న బాల సాహసి - రాజేష్



# 5. రాజేష్ సాహసం

దేశ వ్యాప్తంగా అత్యంత ధైర్య సాహసాలు ప్రదర్శించిన బాలలు ఎందరో ఉన్నారు. వారందరూ పరోపకారులే . అటువంటి వారికి జాతీయ సాహస బాలల అవార్డు ఇస్తారు. అలా అవార్డు అందుకున్న వారిలో మన రాష్ట్రానికి చెందిన ఎనిమిది సంవత్సరాల బాలుడు కూడా ఉన్నాడు. అతని పేరు రాజేష్.

రాజేష్‌కు సాహస కథలంటే ఇష్టం. సాహసం చేయడం అంటే మరీ ఇష్టం. ఆరోజు డిశంబరు 1, 1995. రాజేష్ తన పొరుగు వారితో కలసి విహార యాత్రకు బయలుదేరాడు. పదకొండు మందితో తుంగభద్రా నదిపై పడవ బయలుదేరింది. వారు పాటలు పాడుతున్నారు. రాజేష్ కేరింతలు కొడుతున్నాడు. పడవ ఇలా రెండు కిలోమీటర్లు సాగింది. పడవకు ఎప్పుడు రంధ్రం పడిందో కాని, పడవలోకి మెల్లమెల్లగా నీళ్ళు రావడం మొదలైంది. పడవ నడుపుతున్న వ్యక్తి దీనిని గమనించాడు. ఒక్కసారిగా నీటిలో దూకాడు. అంతసేపు ఆనందంగా ప్రయాణం చేస్తున్న వారు అదిరిపడ్డారు. పడవ వదలిపెట్టి వెళ్ళిపోతున్నాడని భయపడ్డారు. అరిచారు. ఏం చేయాలో తోచలేదు. ఊహించని ఈ పరిణామానికి ప్రయాణీకులు బిత్తర పోయారు. అందరూ కలసి అతనిని పట్టుకోవాలనుకున్నారు. ఒక్కసారిగా వారందరూ ఒకే వైపుకు వచ్చారు. పడవ ఒకవైపుకు ఒరిగింది. తలకిందులైంది. ప్రయాణీకులు నీటిలో పడ్డారు. వస్తువులు నీటిపాలయ్యాయి.

నీటిలో పడిన రాజేష్ సమయస్ఫూర్తితో సాహసించాడు. తనకు దగ్గరలో నీళ్ళలో పడిన ఒక

సంవత్సరం పాపను తన భుజాలపై ఎక్కించుకున్నాడు. సూట్‌కేస్ ఆసరాతో ఒడ్డుకు ఈదసాగాడు. అటువైపు వస్తున్న పడవలోకి పాపను చేర్చాడు. ప్రథమ చికిత్స చేసి పాపను కాపాడాడు. ఒడ్డుకు చేరిన రాజేష్‌ను అందరూ అభినందించారు.

రాజేష్ 'జాతీయ సాహస బాలల అవార్డు' కు ఎంపికయ్యాడు. రాజేష్‌కు కేంద్ర ప్రభుత్వం ఉచిత విద్యా, వైద్యసౌకర్యాలు కల్పించింది. ఇలాంటి సాహస బాలల చేతుల్లో భారతదేశం సురక్షితంగా ఉంటుందని ప్రధాని ప్రశంసించారు. రాజేష్‌ను జనవరి 26, 1998న న్యూఢిల్లీలో జరిగిన రిపబ్లిక్ దినోత్సవంలో ఏనుగు పైన ఊరేగించారు.

చూశారా! మరొకరి క్షేమంకోసం పాటుపడిన రాజేష్ సాహసం అది.



# 6. రంగన్న డైరీ

ప్రతిరోజూ రంగన్న డైరీ రాస్తాడు. డైరీ అంటే ఒక రోజులో జరిగిన దానిని రాయడం. దీనిని 'దినచర్య' అని తెలుగులో అంటారు. సోమవారం రంగన్న తన డైరీలో ఏం రాశాడో తెలుసుకుందామా ?



తేది 30.8.1999,
సోమవారం.

పొద్దున 6 గంటల 30 నిమిషాలకు అమ్మ నన్ను నిద్ర లేపింది. కాలకృత్యాలు తీర్చుకొన్నాను. 7.00 నుండి 7.30 వరకు పెరట్లో కూరగాయల మొక్కలకు నీళ్లు పెట్టాను. శుభ్రంగా స్నానం చేశాను. ఉతికిన బట్టలు ధరించాను. 8.30కి బడికి వెళ్లాను.

విద్యార్థుల సమావేశంలో ప్రధానోపాధ్యాయులు మాట్లాడారు. "బడి, ఇల్లు, పల్లె పరిసరాలు పరిశుభ్రంగా ఉంచాలి. మొక్కలు పెంచాలి. బడికి రాని పిల్లలను బడికి తీసుకు రావాలి" అని చెప్పారు.

తెలుగు పీరియడ్‌లో టీచర్ మమ్మల్ని గుండ్రంగా కూర్చోమంది. నిన్న చెప్పుకున్న కథను మౌనంగా చదవమంది. శ్రీనివాస్‌ను కథలోని మొదటి వాక్యాన్ని సొంతమాటల్లో చెప్పమంది. ఇలా ఒక్కొక్కరిని ఒక్కొక్క వాక్యం జతచేస్తూ కథ పూర్తి చేయమంది. రాజేశ్, సరళ తప్ప మిగిలినవారందరూ కథ సరిగా చెప్పారు. ఈ ఆట మాకు బాగా నచ్చింది.

11.00 గంటలకు లెక్కల పీరియడ్. భాగహారం లెక్కలు ఆటల ద్వారా చేశాం. టీచర్ మాకు లెక్కలను ఆటలు, పాటలు, కథల ద్వారా చక్కగా అర్థమయ్యేలా చెప్తారు.

పగలు మొదటి పీరియడ్‌లో ఆహారపదార్థాలు, ఆహారపు అలవాట్ల గురించి జట్లలో చర్చించాం. పట్టికలో రాశాం. తరువాత పీరియడ్‌లో బొమ్మలు గీశాం. వాటి గురించి మాట్లాడాం. చిత్రకథ కూడా చెప్పుకున్నాం. ఇంతలో బడిగంట కొట్టారు. కథలు, ఆటలతో మాకు తెలియకుండా కాలం ఇట్టే గడిచిపోయింది. బడిలో ఉండే సమయం ఇంకా పెంచితే బాగుండేది.

4.00 గంటలకు ఇంటికి వచ్చాను. సత్యం మామయ్య ఈ నెల కథల పుస్తకం పంపాడు. పుస్తకం అట్ట మీది బొమ్మ చాలా గమ్మత్తుగా ఉంది. సరదాలు – సంబరాలు, వింతలు – విశేషాలు, కుందేలు–సింహం, అంతరిక్ష పిశాచి, పేదరాసి పెద్దమ్మ కథలు నాకు బాగా నచ్చాయి. రాత్రి 9.00 గంటలకు నిద్రపోయాను.

రంగన్న వాళ్ల తరగతి పిల్లలందరూ డైరీ రాస్తారు. ఇదే రోజున రవి తన డైరీలో తను హైదరాబాదు వెళ్లినట్లు రాశాడు. తిరిగి వచ్చేటప్పుడు కొన్ని కొత్త కథల పుస్తకం బస్సులో పోగొట్టుకున్నట్లు రాశాడు. కథల పుస్తకం రంగన్నదే అని కమల నిరూపించింది. రవి తన తప్పు ఒప్పుకున్నాడు.      కాని పనులు చేయనని చెప్పాడు.

## ఇవి చేయండి



అ  కింది ప్రశ్నలకు జవాబులు రాయండి.

1. డైరీ అంటే ఏమిటి ? అది ఏ భాషలోని పదం.?
2. తెలుగులో డైరీని ఏమని పిలుస్తారు ?
3. సత్యం మామయ్య ఏ తేదీన రంగన్నకు కథల పుస్తకం పంపాడు ?
4. రవి ఏ తేదీన కథల పుస్తకం పోగొట్టుకున్నాడు.?
5. మీకు ఎలాంటి పుస్తకాలంటే ఇష్టం ?
6. కమల కథల పుస్తకం రంగన్నదే అని ఎలా నిరూపించింది?



ఆ  ఇక్కడ పాఠంలోలేని కొన్ని పదాలు ఉన్నాయి. వాటి చుట్టూ గీత గీయండి.

ప్రధానోపాధ్యాయులు, మంగళవారం, పాటలు, చెట్లు, మల్లన్న, రమేశ్, విష్ణు, మొక్కలు, కారు.

ఇ  ఎవరు ఎలాంటి వారో పట్టికలో రాయండి.

____________________

____________________

____________________

____________________

____________________



**జతచేయండి.**

| | |
|---|---|
| క్రికెట్ | గుత్తి |
| అల్లరి | జట్టు |
| పూవుల | మూక |
| ఆవుల | కుప్ప |
| ధాన్యం | మంద |



# 7. బాల భటులు

అది హైదరాబాదు. ఆబిడ్స్ కూడలి. ట్రాఫిక్ వారోత్సవం జరుగుతున్నది. కూడలిలో ఒక పోలీసు నిలబడ్డాడు. వాహనాలకు సూచనలు ఇస్తున్నాడు. ఒక అబ్బాయి ఆ పోలీసుకు సహాయపడుతున్నాడు. అతడు ప్రత్యేక దుస్తులు ధరించి ఉన్నాడు. కొంచెం దూరంలో ఒక అంధుడు రోడ్డు దాటడానికి ప్రయత్నిస్తున్నాడు. వాహనాల రాక పోకలతో రోడ్డు రద్దీగా ఉంది. ఆ అంధుడు రోడ్డు దాటలేక పోతున్నాడు. ఎవరి పనుల్లో వారు పోతున్నారు. పోలీసుకు సహాయ పడుతున్న బాలుడు అది చూశాడు. ముందుకు వచ్చి అతనికి చేయి అందించాడు. జాగ్రత్తగా రోడ్డు దాటించాడు. మళ్ళీ తన స్థానానికి వెళ్ళి నిలబడ్డాడు. ఆ బాలుడు ఒక స్కౌటు.



సామాజిక సేవా కార్యక్రమాల్లో పాల్గొంటూ, సేవ చేసే పిల్లలను స్కౌట్లు అంటారు. ఇది ఇంగ్లీషు పదం. తెలుగులో మనం 'బాల భటులు' అని అంటున్నాం. వీరిలో ఆరు నుండి పది సంవత్సరాల వయస్సు ఉండే బాలురను 'కబ్బులు' అంటారు. బాలికలను 'బుల్ బుల్లు' అంటారు. అట్లాగే పదకొండు నుండి పదహారు సంవత్సరాల వరకు వయస్సు ఉండే బాలురను 'స్కౌట్లు' అంటారు. బాలికలను గైడ్సు అంటారు.

శిక్షణలో స్కౌట్లు, గైడ్సు



ఈ బాల భట వ్యవస్థకు మూల పురుషుడు 'లార్డ్ బేడెన్ పవెల్' "భగవంతుని పట్ల భక్తి కలిగి ఉండడం, మాతృదేశానికీ, తోటి మానవులకూ సేవ చేయడం" స్కౌట్ల ప్రధాన ఆశయాలు. బాల బాలికలు వ్యక్తి గతంగా అభివృద్ధి చెందాలి. అందుకు తగిన విధంగా స్కౌటు శిక్షణను రూపొందించారు. పిల్లలలో నైపుణ్యాలను పెంపొందించడం, ఇతరులతో కలసి మెలసి పనిచేయడం. ఇవే ఈ శిక్షణ ప్రధాన ఉద్దేశాలు.

## బాల భటులు శిక్షణలో నేర్చుకొనే అంశాలు:

- జాతీయ పతాకాన్ని, స్కౌటు పతాకాన్ని ఎగుర వేయడం నేర్చుకోవాలి.
- జాతీయ గీతాలను పాడడం అభ్యసించాలి.
- సేవా సంస్థలను గురించి తెలుసుకోవాలి.
- ప్రథమ చికిత్స చేయడంలో శిక్షణ పొందాలి.
- వ్యక్తిగత పరిశుభ్రతను పాటించాలి.
- రకరకాల ముడులు వేయడంతో పాటుగా ముడుల ఉపయోగాలను తెలుసు కోవాలి.
- ఆటలు పాటలు కూడాఈ శిక్షణలో భాగమే.

స్కౌటులో చేరిన తర్వాత ప్రమాణం తీసుకుంటారు. కుడిచేతి వందనం,ఎడమచేతి కరచాలనం సంప్రదాయం. అదేవారి రహస్య సంకేతం. వీరు బూడిదరంగు చొక్కా, ముదురు నీలిరంగు నిక్కరు ధరిస్తారు. భుజాలపై 'బ్యాడ్జి' ఉంటుంది. స్కౌట్లు బ్యాడ్జిని చొక్కా ఎడమ జేబుకు ధరిస్తారు. మెడకు రుమాలు దానికి 'వాగల్' (రింగు) ఉంటుంది. తలకు 'బ్లూ బెరట్' క్యాప్ దరిస్తారు. ఖాకీ రంగు నూలు బెల్టు కట్టుకుంటారు. నల్లని బూట్లు వేసుకుంటారు. చేతిలో కర్ర పట్టుకుంటారు.

సెలవు దినాల్లో ప్రత్యేక స్థలాల్లో శిబిరాలు నిర్వ హిస్తారు. ఇందులోరకరకాల గుడారాలు వేయడం నేర్పుతారు. వస్తువులు, ఆహార పదార్థాలు సేకరించు కుంటారు. సామూహిక భోజనాలు చేస్తారు. రాత్రుల్లో 'శిబిరాగ్ని' నిర్వహిస్తారు. దాని చుట్టూ చేరి పాటలు పాడుతారు ఆటలు ఆడుతారు, సంతోషంతో గంతులు వేస్తారు. ఇవన్నీ ఎంతో ఆనందాన్ని కలుగ జేస్తాయి. మనలో ఐక్యతను, సఖ్యతను, ఉత్సాహాన్నీ పెంచుతాయి. స్కౌటు ఆశయం 'సంసిద్ధుడివికా!'

దేనికి సంసిద్ధుడు కావడం ? సమాజ సేవకు అని మనం తెలుసుకోవాలి.



శిబిరాగ్ని నిర్వహణ



# 8. ఉపాధ్యాయ దినోత్సవం



సమయం : ఉదయం 7 గంటలు.

తాతయ్య : ఏం విజయ్, ఈ రోజు చాలా తొందరగా తయారవుతున్నావే ?

విజయ్ : ఈ రోజు మా పాఠశాలలో ఉపాధ్యాయ దినోత్సవం తాతయ్యా! తొందరగా వెళ్ళాలి.

తాతయ్య : ఓహో. ఈ రోజు సెప్టెంబరు అయిదవ తేదీ కదూ ... మరిచేపోయాను. విజయ్, ఈ బొమ్మ చూశావా ?

విజయ్ : భలే భలే! బండిని మనుషులు లాగుతున్నారేమి తాతయ్యా !

తాతయ్య : బండిని లాగుతున్నది విద్యార్థులు. బండిలో కూర్చున్నది ఎవరో తెలుసా?

విజయ్ : ఎవరు తాతయ్యా ?

తాతయ్య : భారత రత్న డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్

విజయ్ : అలాగా !

తాతయ్య : రాధాకృష్ణన్ గొప్ప విద్యావేత్త, తత్వవేత్త. దేశ విదేశాల్లోని విశ్వవిద్యాలయాల్లో ఆచార్యులుగా పనిచేశారు. మైసూరులో ఆచార్యులుగా పనిచేసి, ఆ ఊరు వదలి వెళ్ళేటప్పుడు......,

విజయ్ : ఆ....

తాతయ్య : విద్యార్థులు ప్రేమతో వీరు కూర్చున్న గుర్రపు బండిని రైల్వే స్టేషన్ వరకూ లాగారు.

విజయ్ : ఎందుకు తాతయ్యా !

తాతయ్య : వారి శిష్యులకు ఆయనపట్ల ఉన్న గౌరవం, ప్రేమ అలాంటివి.

విజయ్ : రాధాకృష్ణన్ గారి గురించి తెలుసుకోవాలని ఉంది తాతయ్యా ! చెప్పవూ ?

తాతయ్య : రాధాకృష్ణన్ 1888వ సంవత్సరం సెప్టెంబరు 5న పుట్టారు. అప్పటి చిత్తూరు జిల్లాలోని తిరుత్తణి వీరి జన్మస్థలం. ప్రస్తుతం ఇది తమిళనాడులో ఉంది. వీరు సామాన్య కుటుంబానికి చెందినవారు. ఆయన

చురుకుదనం, తెలివి తేటలకు
ఉపాధ్యాయులే ఆశ్చర్యపోయేవారట!

విజయ్ : అబ్బో ! ఎంత గొప్పవారు తాతయ్యా!

తాతయ్య : అవును. మొదట ఆయన ఉపాధ్యాయుడుగా పని చేశారు. ఉపాధ్యాయ వృత్తికే గౌరవం తెచ్చారు. అంచెలంచెలుగా ఎదిగారు. రాష్ట్రపతి పదవి పొందారు. ఆయన సేవలకు అత్యున్నత పురస్కారంగా భారత రత్న ఇచ్చి గౌరవించాము. ఆయన పుట్టిన రోజును ఉపాధ్యాయ దినోత్సవంగా మనం జరుపు కుంటున్నాం.

విజయ్ : అయితే మా పాఠశాలలో ఇవాళ జరిగేది ఇదేనన్నమాట.

తాతయ్య : ఔను.

విజయ్ : భలే బాగా చెప్పావు తాతయ్యా ! ఇక నేను బడికి వెళ్తా,సమయమౌతోంది.

| సమయం: సాయంత్రం 6 గంటలు |
|---|

తాతయ్య : విజయ్, బడిలో కార్యక్రమం బాగా జరిగిందా ?

విజయ్ : చాలా బాగా జరిగింది తాతయ్యా. మొదట పాఠశాలలో సమావేశమయ్యాం. వేదికపై రాధాకృష్ణన్ గారి చిత్రపటాన్ని ఉంచారు. పూలమాల వేశారు. తర్వాత ....

తాతయ్య : మీ ఉపాధ్యాయులెవరైనా మాట్లాడారా ?

విజయ్ : ఆ ! మాట్లాడారు. ముందుగా మా ప్రధానోపాధ్యాయులు రాధాకృష్ణన్ జీవిత చరిత్ర చక్కగా వివరించారు. ఆయన లాగా ఉన్నతంగా ఎదగాలని మాకు చెప్పారు. అందరూ క్రమశిక్షణను అలవరచుకోవాలన్నారు. రాధాకృష్ణన్ లాగా గొప్ప పండితులు కావాలని బోధించారు. మా ఉపాధ్యాయులంతా ఉపన్యసించారు. పిల్లలం కూడా కొంత మందిమి మాట్లాడాం.



సర్వేపల్లి రాధాకృష్ణన్

తాతయ్య : నీవూ మాట్లాడావన్న మాట!

విజయ్ : ఆ! నేనూ మాట్లాడాను. తర్వాత ఇటీవల పదవీ విరమణ చేసిన సులోచన టీచరును మేమంతా సన్మానించాం.

తాతయ్య : బావుంది. ఈ రోజు ఉత్తమ ఉపాధ్యాయులకు జాతీయ, రాష్ట్ర, జిల్లా స్థాయిలలో అవార్డులు ఇచ్చి గౌరవిస్తారు. గురువులను గౌరవించడం మన కర్తవ్యం.






## ఇవి చేయండి

అ. కింది పేరాను చదివి జవాబులివ్వండి:

గాంధీ పుట్టిన రోజును గాంధీ జయంతి అంటారు. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజును స్వాతంత్ర్య దినం అంటారు. ఆ రోజుల్లో మనం ఉత్సవాలు జరుపుకుంటాము.

# 9. మా కథ


నిర్మల్ కొయ్యబొమ్మ - చిరుత పులి

మేమంటే మీకు చాలా ఇష్టం కదూ! మాలో ఎన్నోరకాలు ఉంటాయి. కొయ్య బొమ్మలు, రంగుబొమ్మలు, కదిలే బొమ్మలు, కదలని బొమ్మలు. కదిలే బొమ్మలంటే పిల్లలు మరీ ఇష్ట పడతారు. పెద్దలకు కూడా బొమ్మలంటే ఇష్టమే. మేము మాట్లాడే బొమ్మలం. మా కథ చెబుతాం వింటారా ?

నిర్మల్ పేరు విన్నారా? నిర్మల్ మన రాష్ట్రంలో ఆదిలాబాదు జిల్లాలోని ఒక పట్టణం. మేము నిర్మల్ బొమ్మలం. అంటే నిర్మల్‌లో తయారయ్యే బొమ్మలం. ప్రపంచంలోనే మేము అందానికి పేరు పొందాం.

పదిహేడవ శతాబ్దిలో నిర్మల్ ప్రాంతాన్ని నిమ్మనాయుడనే రాజు పాలించేవాడట. అతనికి బొమ్మలంటే ప్రాణమట. ఆ మక్కువతో కొయ్య బొమ్మలను చెక్కే కొంతమంది కళాకారులను రప్పించు కున్నాడట. అప్పటి నుండీ నిర్మల్‌లో మా బొమ్మల ప్రపంచం మొదలయింది. ఇప్పుడు మామీద ఆధారపడి జీవించే కళాకారుల కుటుంబాలు రెండు వందల దాకా ఉన్నాయి. మేము ఎక్కడ ఉంటామో తెలిసింది కదూ! ఇటురండి, ఈ వరుసను చూడండి. మమ్మల్ని బొమ్మలనుకుంటారా ఎవ్వరైనా? ఒక్క మాకే కాదు, రకరకాల చిత్రాలకు కూడా ఈ నిర్మల్ ప్రసిద్ధి చెందింది.

విదేశాలనుండి కూడా ఎంతోమంది వస్తుంటారు. మమ్మల్ని జపాన్, అమెరికా, జర్మనీ, అరబ్బుదేశాలకు ఎగుమతి కూడా చేస్తున్నారు.

నిర్మల్ లో లాగానే మరికొన్ని చోట్ల కూడా అందమైన కొయ్యబొమ్మలు తయారవు తున్నాయి. కృష్ణాజిల్లా కొండపల్లిలో తయారయ్యే బొమ్మల్ని కొండపల్లి బొమ్మలంటారు. చిత్తూరు జిల్లాలోని తిరుపతి, శ్రీకాళహస్తులలో కూడా చెక్కబొమ్మలు చేస్తారు. ఈ రకరకాల బొమ్మలన్నీ అందం కోసం, మీ ఆనందం కోసమే కదా !

మమ్మల్ని ఆకర్షణీయంగా తీర్చి దిద్దే వాళ్ళను దారు శిల్పులంటారు. దారువు అంటే కొయ్య. అందంగా బొమ్మలు చెక్కేవాళ్ళను శిల్పులంటారు. రాష్ట్ర స్థాయిలోనూ జాతీయ స్థాయిలోనూ నిర్మల్‌శిల్పులు ఎన్నో బహుమతులు పొందారు. నిర్మల్‌పట్టణానికే కాక, మనరాష్ట్రానికీ, దేశానికీ కూడ ఎనలేని కీర్తి తెచ్చారు.



నిర్మల్ కొయ్యబొమ్మ - బాతు

మేమెలా తయారవుతామో తెలుసుకోవాలని అనుకుంటున్నారు కదూ. మమ్మల్ని ఒక ప్రత్యేక కలపతో తయారు చేస్తారు. దాన్ని 'పొనికి కలప' అంటారు. అది నిర్మల్ అడవుల్లో దొరుకుతుంది. మమ్మల్ని ఇంత అందంగా, ముచ్చటగా తయారు చేసే కళాకారులను ఏమంటారో తెలుసా? నకాషీలు అని. నకాషీ కుటుంబంలో ప్రతి ఒక్కరూ మాకు ప్రాణం పోయడంలో పాలు పంచుకుంటారు. అంటే మేము నిర్మల్ కుటీర పరిశ్రమలో తయారవు తున్నాం. కుటీర పరిశ్రమలంటే ఏమిటో తెలుసా? ఇంటి ఆవరణలోనే అందరు కలసి తక్కువ ఖర్చుతో వస్తువులు తయారు చేయడం. మమ్మల్ని చూడగానే మీరు మురిసి పోతారు. సొంతం చేసు కోవాలంటే మేము ప్రధానమైన పట్టణాలన్నింటిలోను దొరుకుతాం. మాకోసం

నిర్మల్ వర్ణచిత్రం



# 10. చెట్టు

వాన వర్షం
కురవాలంటే
పసిడి పంటలే
పండాలంటే
చిన్నా పెద్దా చేతులు కలిపి
చెట్టూ చేమా పెంచాలి!

జగతిని హర్షం
నిండాలంటే
ప్రగతికి బాటలు
వేయాలంటే
తరువులు బాగా పెంచాలి
కరువును దూరం చేయాలి!

చల్లని నీడలు
కావాలంటే
వ్యాధుల పీడలు
పోవాలంటే
వృక్ష సంపదను పెంచాలి
స్వచ్ఛతనే సాధించాలి!

కలుషిత వాయువు
తొలగాలంటే
మనిషికి ఆయువు
పెరగాలంటే
పచ్చని చెట్లను పెంచాలి
ప్రాణ వాయువునే పంచాలి!

చెట్లే పుడమికి ప్రాణాధారం
చెట్లే కలిమికి మూలాధారం
చెట్లు లేనిదే బతుకే లేదు
మానవ జాతికి మెతుకే లేదు.

అ. 'చెట్లు' గేయంలోని వరసలను గమనించండి. వినడానికి ఒకే రకంగా ఉండే పదాలు రాయండి.

| | | | |
|---|---|---|---|
| ఉదా.. | నీడలు | – | పీడలు |
| | వర్షం | – | హర్షం |
| | తరువు | – | ......... |
| | ......... | – | ఆయువు |

ఆ. జవాబులు చెప్పండి. రాయండి.

1. చెట్టుకు ఉన్న మరో రెండు పేర్లు రాయండి.
2. చల్లని నీడలు కావాలంటే ఏం చేయాలి ?
3. కలుషిత వాయువు అంటే ఏమిటి ?
4. "చెట్లు లేనిదే బతుకే లేదు" ఎందువలన ?

ఇ. కింది అర్థాన్నిచ్చే పంక్తులు గేయంలో ఎక్కడ ఉన్నాయో గుర్తించి రాయండి.

1. ప్రపంచమంతా సంతోషంగా ఉండాలంటే
2. చెట్లు సంపదకు మూలం

..........................................................................

..........................................................................



# 11. మెదడుకు మేత

దసరా పండుగకు సెలవులు ఇచ్చారు. సరళావాళ్ల గోపాలం మామయ్య హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నాడు. సరళ సెలవులలో మామయ్య ఇంటికి వెళ్లింది. గోపాలం చాలా సరదాగా మాట్లాడతాడు. సరళకు మామయ్యతో మాట్లాడడం అంటే ఎంతో ఇష్టం. ఒకరోజు 'జూ' కు తీసుకొని వెళ్లమని మామయ్యను అడిగింది సరళ. "సరే ! రేపు పొద్దున్నే వెళ్దాం" అన్నాడు మామయ్య. 'జూ' కు వెళ్తున్నానన్న సంతోషంతో ఆరోజు రాత్రి సరళకు నిద్రరాలేదు. మామయ్యను ఏదైనా కథ చెప్పమని అడిగింది. "కథకాదు పొడుపు కథలు చెప్తాను. సరిగా సమాధానాలు చెప్తే రేపు ఐస్‌క్రీం కొనిస్తాను" అన్నాడు. 'సరే !' అంది సరళ.

చెయ్యని కుండ - పొయ్యని నీరు
తెల్లని సున్నం - పెట్టని పిలక
ఏమిటదీ ? ఏమిటదీ ?

ఆకాశాన తిరుగుతాను - పక్షిని కాదు
పెద్ద మోతతో పయనిస్తాను - మేఘాన్నికాదు
కోరితే దేశ దేశాలు - తిప్పుతాను
ఎవరినీ ? నేనెవరినీ ?

నీటిలో ఉంటాను
కన్ను మూయకనే నిద్రపోతాను.
ఎవరినీ ? నేనెవరినీ ?

ముక్కుతో ముత్యాలు కరచుకొని
తోకతో నీళ్ళు తాగుతుంది
ఏమిటదీ ? ఏమిటదీ ?

ఇల్లాంటి పొడుపు కథలను మామయ్య మరికొన్నిటిని చెప్పాడు. వాటికి సరళ సరైన జవాబులు చెప్పింది. సరళ తెలివిని మెచ్చుకొని మామయ్య 'జూ' కు వెళ్లినప్పుడు ఆమెకు ఐస్‌క్రీం కొని ఇచ్చాడు.

## ఇవి చేయండి



అ. పై చిత్రంలో మామయ్య చెప్పిన పొడుపు కథలకు జవాబులు ఉన్నాయి. గుర్తించండి. సరైన జవాబులను మామయ్య చెప్పిన పొడుపు కథలకు ఎదురుగా సరళ వద్ద ఉన్న ( ) ల్లలో రాయండి.

ఆ. మామయ్య మరికొన్ని పొడుపు కథలు చెప్పాడు కదా ! అవి ఏమిటో ఊహించి చెప్పండి. వాటికి జవాబులు ఇవ్వండి.

ఇ. కింది చిత్రాలను చూసి వాటికి ఎదురుగా పొడుపు కథలు రాయండి.

ఉదా॥



రంగులుంటాయి కాని చిలుక కాదు.
రెక్కలుంటాయి కాని పక్షికాదు.
ఏమిటదీ ? ఏమిటదీ ?

1.



2.



# 12. జాబు

తాడిపత్రి,
02. 11. 99.

ప్రియమైన శ్రీదేవీ,

నేను బాగున్నాను. బాగా చదువు కుంటున్నాను. నువ్వు ఎలా ఉన్నావు ?

దేవీ ! ఎన్ని రోజులకో పాలంపేటలో కలిశాం కదా! ఇద్దరం కలసి చాలా చాలా తిరగాలనుకున్నాం. రామప్ప చెరువు కట్టపై ఆడుకోవాలనీ అనుకున్నాం. ఎంత పెద్ద చెరువో! అబ్బో! ఆ గుడి, ఆ చెరువు, రంగు రంగుల పక్షులు ఎంతబాగున్నాయో ! నాకు అక్కడే ఉండాలని అన్పించింది. కానీ అంతలోనే వెళ్లి పోవలసి వచ్చింది. ఇంటికి వచ్చాక రామప్ప చెరువు గురించి నాన్న చెప్పారు. ఆ చెరువు వలన పండే పంటలు ఎన్నో కుటుంబాలను ఆదుకొంటున్నాయని కూడా అన్నారు. మళ్లీ మనం ఎప్పుడు కలుస్తామో ! అందుకే అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూండు. అలాగయినా మనం మాట్లాడుకున్నట్లు ఉంటుంది. అక్కడి విశేషాలు ఎన్ని మార్లు చూసి ఉంటావో ? వరంగల్లు కోట, వేయి స్తంభాల గుడి వాటి గురించి రాయి.

అక్కా, తమ్ముడు ఎలా ఉన్నారు? ఏం చదువుతున్నారు? అమ్మా, నాన్నలకు నా నమస్కారాలు తెలియజేయి. నీ ఉత్తరం కోసం ఎదురు చూస్తుంటాను.

నీ
ప్రియ మిత్రురాలు,
పూల కుంట్ల నిర్మల

अन्तर्देशीय पत्र कार्ड
INLAND LETTER CARD

भारत
INDIA 75

చిరునామా :

సంగటి శ్రీదేవి,
సంగటి వీరయ్య కుమార్తె, టీచర్స్ కాలనీ, హనుమకొండ,
వరంగల్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం,
పిన్‌కోడ్ 506001,

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారిచే ఉచిత పంపిణీ

# 13. కనువిప్పు

ఒక అడవి సమీపాన ఒక పూరి గుడిసె ఉండేది. అందులో కొండయ్య, కాంతమ్మ దంపతులు కాపురం ఉండేవాళ్ళు. కొండయ్య అడవికి వెళ్ళి కట్టెలు కొట్టుకొని వచ్చి, పట్టణంలో అమ్మేవాడు. ఇలా వాళ్ల జీవనం సాగించేవారు.

ఒక రోజు మామూలుగా కొండయ్య కట్టెల కోసం అడవికి వెళ్ళాడు. ఒక చెట్టు కొట్ట బోయాడు. అప్పుడు వన దేవత ప్రత్యక్షమయింది. "చెట్టు నరకడం వలన అడవి పాడవుతుంది. చెట్లు నరకవద్దు" అంది. "కట్టెలు కొట్టి అమ్మకపోతే నాజీవితం ఎట్లా గడుస్తుంది" అన్నాడు కొండయ్య. అప్పుడు వనదేవత " నీకు ఒక పాడి ఆవును ఇస్తాను. దాని పాలు అమ్ముకొని సుఖంగా జీవించు" అంది. కొండయ్య సరేనన్నాడు. వనదేవత అతనికి ఒక పాడి ఆవును ఇచ్చింది.

కొండయ్య ఆవును తోలుకొని ఇంటికి వెళ్ళాడు, భార్యకు చూపాడు. ఆమె కూడా చాలా ఆనంద పడింది. రోజూ పాలు అమ్మగా వచ్చిన డబ్బుతో వాళ్ల జీవితం గడిపేవారు. కొన్ని రోజులు గడిచాయి. రోజూ ఆవుకి మేత వేయాలి, పాలు పితకాలి. కాంతమ్మకు విసుగు వేసింది. కష్టపడకుండా డబ్బు సంపాదించాలి. భర్తను మళ్ళా అడవికి పంపింది. కొండయ్య ఆవును తోలుకుని అడవికి వెళ్ళాడు. గొడ్డలితో ఒక చెట్టు నరక బోయాడు. వనదేవత ప్రత్యక్షమయింది " ఏమిటి కొండయ్యా! మళ్ళీవచ్చావు? చెట్టును ఎందుకు నరక బోతున్నావు?" అని అడిగింది.



అప్పుడు కొండయ్య "ఈ ఆవు వద్దు. ఇంకా ఎక్కువ డబ్బు వచ్చే ఉపాయం చెప్పు" అన్నాడు. వన దేవత సరే అంది. ఆవును తీసుకొని ఒక బాతును ఇచ్చింది. ఇది ప్రతి రోజు ఒక బంగారు గుడ్డు పెడుతుంది. అమ్ముకుని సుఖంగా జీవించమని చెప్పింది. కొండయ్య బాతుతో ఇల్లు చేరాడు.

బాతు ప్రతి రోజూ ఒక బంగారు గుడ్డు పెట్టేది. దాన్ని అమ్మి వచ్చిన డబ్బుతో రోజులు గడిపేవాళ్ళు. కొన్ని రోజులకు కాంతమ్మకు మళ్లీ విసుగు పుట్టింది. "ఈ బాతు రోజుకు ఒక గుడ్డు మాత్రమే పెడుతుంది. మనం త్వరగా ధనవంతులం కావాలంటే కోరిన ధనం వెంటనే ఇచ్చే సంచి కావాలి. అది అడిగి తీసుకురా!" అని మళ్ళీ కొండయ్యను అడవికి పంపింది. కొండయ్య బాతును తీసుకొని అడవికి వెళ్ళాడు. చెట్టు నరకబోయాడు. వనదేవత ప్రత్యక్షమయింది. "ఏం కొండయ్యా! మళ్ళీ వచ్చావు" అంది. "ఈ బాతు రోజుకు ఒక గుడ్డు మాత్రమే పెడుతుంది. మాకు ఇది వద్దు. ధనం ఇచ్చే సంచి ఇవ్వు" అన్నాడు. అతని అత్యాశకు వనదేవతకు కోపం వచ్చింది. బాతుతో పాటు మాయమై పోయింది.

కొండయ్యకు కోపం వచ్చింది. బలంగా గొడ్డలితో చెట్టు కొమ్మ నరికాడు. అది తెగి కొండయ్య కాళ్ళపై పడింది. కాళ్ళు విరిగాయి. పడిపోయాడు. కాంతమ్మ కొండయ్యను వెతుక్కుంటూ అడవికి వచ్చింది. ఎలాగో కొండయ్యను తీసుకొని ఇల్లు చేరింది. కొండయ్య పని చేయ లేడు. ఎట్లా? కాంతమ్మే అడవికి వెళ్ళి ఉసిరి, నేరేడు, రేగు పండ్లు ఏరుకొని వచ్చేది. వాటిని తినేవారు. గింజలను ఇంటి వెనుక ఖాళీ స్థలంలో విసిరవేసేవారు. కొన్నాళ్ళకు అవి మొలకలెత్తి పెరిగి పెద్దవయ్యాయి. కాయలు కాశాయి. కాంతమ్మకు అడవికి వెళ్ళే బాధ తప్పింది. కావలసిన పండ్లు తాము తినేవారు. మిగిలినవి సంతలో అమ్మేవారు. చెట్లను కొట్టి బతకడమే కాకుండా చెట్లను పెంచి కూడా జీవితం సాగించవచ్చని కొండయ్య దంపతులు గ్రహించారు.

ఇంటిముందున్న ఖాళీ స్థలాన్ని కాంతమ్మ చదును చేసింది. రకరకాల పండ్ల మొక్కలు నాటింది. ప్రతిరోజు క్రమం తప్పక నీరు పోసేది. ఒక రోజు వనదేవత ప్రత్యక్షమయింది. వాళ్ళు చేసే మంచి పని చూసింది. సంతోషపడి దీవించింది. కొండయ్య దంపతులకు మొక్కల పెంపకం విలువ తెలిసింది. తమ చుట్టుపట్ల మొక్కలు నాటడంలో నలుగురికీ తోడ్పడ్డారు. ఆనందంగా జీవనం గడిపారు.



# 14. ఉన్నవ లక్ష్మీబాయమ్మ



అవి స్వాతంత్ర్యం కోసం మనం పోరాటం జరుపుతున్న రోజులు. ఆ రోజు 1921 వ సంవత్సరం జూలై 22 వ తేదీ. గుంటూరు రైల్వే స్టేషన్ కోలాహలంగా ఉంది. అరెస్టు అయిన నాయకులను రైల్లో రాజమండ్రి సెంట్రల్ జైలుకు తరలిస్తున్నారు. ఇసుక వేస్తే రాలనంత జనం. ఆ జనం మధ్యలో ఒక స్త్రీ సాదా ఖద్దరు చీర ధరించి ఉంది. ఒక చేతిలో త్రివర్ణ పతాకం మరో చేతిలో పూలమాల పట్టుకుంది.

రైలు ప్లాట్‌ఫారం మీదకు వచ్చింది. ఒక్కసారిగా ప్రజలంతా నాయకులకు జేజేలు పలికారు. ఆమె తన చేతిలోని పూలమాలను ఒక నాయకుడి మెడలో వేసింది. ఆయనకు వీరతిలకం దిద్దింది. "మీరు నడిపించిన ఉద్యమాలను మీ భార్య నడపడానికి అనుమతి ఇవ్వండి" అని కోరింది.

ఆవిడ ఎవరో కాదు. ఆయన భార్యే. ఆ నాయకుడి పేరు ఉన్నవ లక్ష్మీ నారాయణ పంతులు. ఆయన గొప్ప సంఘ సంస్కర్త, రచయిత. ఆమె పేరు లక్ష్మీబాయమ్మ. వారిద్దరూ ఉన్నవ దంపతులుగా ప్రసిద్ధి పొందారు. వారు నడిపించిన ఉద్యమాలకు లెక్కలేదు. ఆమె భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంది. సంఘ సంస్కరణకు పాటు పడింది. హరిజనులకు ఎంతో సేవ చేసింది. మద్యపానాన్ని మాన్పించడానికి కృషి చేసింది.

లక్ష్మీబాయమ్మ గుంటూరు జిల్లాలో కొండవీటి కొండల సమీపంలోని అమీనాబాద్ అనే చిన్న గ్రామంలో 1882వ సంవత్సరంలో పుట్టింది. ఒకనాటి కొండవీటి రాజుల పౌరుషాన్ని పుణికి పుచ్చుకుంది. ఆమె తండ్రి నడింపల్లి సీతారామయ్య, తల్లి రామలక్ష్మమ్మ. ఆ రోజుల్లోనే లక్ష్మీబాయమ్మ ఉన్నత భావాలు కలిగిన ఉన్నవ లక్ష్మీనారాయణను వరించి పెండ్లాడింది. ఆయనతో పాటు అనేక ఉద్యమాల్లో పాల్గొంది.

బాల్య వివాహాలను నిరసించింది. వితంతు వివాహాలను ప్రోత్సహించింది. అంటరాని తనాన్ని పారదోలడానికి కృషి చేసింది. మానవులంతా ఒక్కటే అని చాటి చెప్పింది.

ఇలాంటి భావాలు నచ్చని ఆనాటి సమాజం వీరిని వెలి వేసింది. వారికి తాగడానికి ఇన్ని మంచి నీళ్ళు, తినడానికి పట్టెడన్నం ఇవ్వడానికి గ్రామ ప్రజలు భయపడ్డారు. అయినా ఆమె వెనుకంజ వేయలేదు. సమాజాన్ని బాగు చేయడానికి పాటుపడే వారికి కష్టాలు తప్పవు కదా ! లక్ష్మీబాయమ్మ ప్రభావం వల్ల ఎందరో స్త్రీలు సంఘ సంస్కరణ ఉద్యమాల్లో పాల్గొన్నారు. సంగం లక్ష్మీబాయమ్మ, మాగంటి అన్నపూర్ణాదేవి అలాంటివారే.

లక్ష్మీబాయమ్మ కూడా గొప్ప ఉపన్యాసకురాలు. ఒకనాడు ఆమె విశాఖపట్టణం మెడికల్ కాలేజీ లో ఉపన్యసించింది. ఆమె ప్రబోధంతో విద్యార్థులంతా మర్నాడు గాంధీటోపీలు పెట్టుకొని తరగతులకు హాజరయ్యారు.

ఆమెది జాలిగుండె. జంతుబలి ఆమెకు ఇష్టంలేదు. "ముందు నన్ను బలి ఇచ్చి తర్వాత జంతువులను బలి ఇవ్వండి" అంటూ జంతుబలులకు అడ్డుపడి మూగజీవులను కాపాడింది.

ఉన్నవలక్ష్మీబాయమ్మ పేరును కలకాలం జ్ఞాపకం చేసే గొప్ప విద్యాసంస్థ గుంటూరులోని శ్రీ శారదానికేతన్. ఆమె స్థాపించిన ఈ సంస్థ ద్వారా ఎందరో బాల వితంతువులు తమ బతుకులు బాగు చేసుకున్నారు. ఇప్పటికీ ఈ సంస్థ స్త్రీలకు సేవ చేస్తూనే ఉంది.

'గుంటూరు ఝాన్సీ'గా కీర్తి పొందిన లక్ష్మీబాయమ్మ 1952వ సంవత్సరం ఫిబ్రవరి 29 వ తేదీన మరణించింది. ఆమె ఆదర్శ మహిళ.

★ ★ ★



ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారి విగ్రహం - గుంటూరు.



నాగార్జున సాగర్



బౌద్ధశిల్పం

# 15. నాగార్జున సాగర్

"మనోజ్! రెండు రోజుల నుండి ఆడుకోవడానికి రావడం లేదు. ఎందుకని ?" సత్యవ్రత అడిగాడు. "మా తరగతి విద్యార్థులందరిని విహార యాత్రకు తీసుకెళ్ళారు. మా సారు. నేను కూడా వెళ్ళి వచ్చా" మనోజ్ అన్నాడు. "ఎక్కడకు వెళ్ళారు ?" సత్యవ్రత ప్రశ్నించాడు. "నాగార్జున సాగర్‌కు" మనోజ్ జవాబిచ్చాడు. "అక్కడ నువ్వు చూసిన విశేషాలు చెప్పవా ?" సత్యవ్రత అడిగాడు. సత్యవ్రతకు మనోజ్ తాను చూసిన నాగార్జున సాగర్ విశేషాలు చెప్పాడు.

నాగార్జున సాగర్ ప్రాంతాన్ని ఒకప్పుడు 'విజయపురి' అని పిలిచేవాళ్ళు. ఇది గుంటూరు, నల్లగొండ జిల్లాల సరిహద్దులో ఉంది. ఇక్కడ కృష్ణానదికి ఆనకట్ట కట్టారు. ఇది ప్రపంచంలో అతి పెద్ద రాతి ఆనకట్ట. దీనికి 1955 డిసెంబరు 10వ తేదీన శంకుస్థాపన జరిగింది. ఆనకట్ట వల్ల నీరు నిల్వ ఉంటుంది. నీరు నిల్వ ఉండే ప్రదేశాన్ని 'రిజర్వాయర్' అంటారు.

ఇది ఆసియా ఖండంలో పెద్ద రిజర్వాయర్. దీని నుంచి సుమారు ఇరవై

రెండులక్షల పదకొండు వేల హెక్టార్ల భూమికి నీరు అందుతుంది. ఆనకట్ట నుంచి నీరు అందించే కుడి కాలువకు 'జవహర్ కాలువ' అనీ ఎడమ కాలువకు 'లాల్ బహదూర్' కాలువ అనీ నామకరణం చేశారు. రిజర్వాయర్ లోని నీటి నుండి విద్యుత్తు తయారవుతుంది. ఇది చూడదగ్గ విద్యుత్ కేంద్రం.



బౌద్ధారామం

ఈ ఆనకట్ట వ్యవసాయానికి, విద్యుత్తు తయారీకి ఉపయోగ పడుతుంది. అందువల్ల దీనిని 'బహుళార్థ సాధక ప్రాజెక్టు' అంటారు.

ఆనకట్ట తర్వాత ఇక్కడ చూడదగినది నాగార్జున కొండ. ఆనకట్ట నుంచి కొండకు లాంచీలో వెళ్ళాలి. లాంచీలో ప్రయాణం ఎంతో చిత్రమైన అనుభూతిని కలిగిస్తుంది. చుట్టూ కొండలతో ఆ దృశ్యం చూడముచ్చటగా ఉంటుంది. చాలా కాలం కింద నాగార్జునుడు ఈ కొండపై ఒక విద్యాకేంద్రాన్ని నెలకొల్పాడు. ఇక్కడ అరవై నాలుగు కళలు బోధించేవారు. వైద్య విద్యకి ఇది ప్రధాన కేంద్రంగా ఉండేది. ఇది ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రం. ఇక్కడ ఒక బౌద్ధారామం కూడ ఉంది.

నాగార్జున సాగర్ లాంచీ



రిజర్వాయర్ కోసం తవ్వేటప్పుడు చాలా బౌద్ధ శిల్పాలు బయటపడ్డాయి. అందులో కొన్ని ప్రస్తుతం కొండపై ఉన్న మ్యూజియంలో ఉన్నాయి. అద్భుతమైన శిల్ప సంపదను ఇక్కడ చూడవచ్చు. ఈ కొండపైన ఇంకా మహాస్థూపం సింహళ విహారం, అశ్వమేధ యాగస్థలి మొదలైన ప్రదేశాలను చూడవచ్చు. ఆచార్య నాగార్జునుని పేర ఈ రిజర్వాయర్‌కి నాగార్జున సాగర్ అని పేరు పెట్టారు. ఇది అందరూ చూడదగిన అద్భుత విహార కేంద్రం.

మనోజ్ మాటలు విన్న సత్యవ్రతకు నాగార్జున సాగర్ చూడాలనిపించింది. తాను కూడా నాగార్జున సాగర్ వెళ్ళి వస్తానన్నాడు.

దీనికి శంకుస్థాపన చేస్తూ మన ప్రథమ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఆనకట్టలను 'ఆధునిక దేవాలయాలు' అన్నారు. ఆయన అలా ఎందుకన్నారో మీరు ఊహించండి.




# 16. ముద్ద బంతి పూలు

"రేపు క్రిస్మస్ పండగ కదూ.. మేరీ టీచర్ ఇంటికి వెళ్దాం. గ్రీటింగ్స్ చెబుదాం ... ఎవరొస్తారోచ్" అంది సీత. అర్చన, పావని, రజియా ఎగిరి గంతేశారు. "మేరీ టీచరుకు పూలంటే మహా ఇష్టం" అంటూ రంగు రంగుల బంతి పువ్వులను సేకరించారు. " చీకటి పడక ముందే తిరిగి వచ్చేద్దాం " అనుకుంటూ ఉషారుగా బయలుదేరారు. దారిలో శంకరం మాష్టారు ఎదురొచ్చారు. "ఎక్కడికమ్మా, బయల్దేరారు ?" అంటూపలకరించారు. "మేరీ టీచర్ గారింటికి గ్రీటింగ్స్ చెప్పడానికి మాష్టారూ" అన్నారు సంబరంగా. " ఔనౌను. రేపు క్రిస్మస్ పండగకదూ ! ఆ విషయం మరిచేపోయాను. నేనుకూడా వస్తాను. వెళ్దాం పదండి" అంటూ శంకరం మాష్టారు వాళ్ళతో కలిశారు. శంకరం మాష్టారంటే అందరికీ ఇష్టమే మరి. పిల్లలతో ఇట్టే కలిసి పోతారు. ఎన్నెన్నో మంచి విషయాలు చెబుతారు.

దారిలో పావనికి చిన్న సందేహం వచ్చింది. "క్రిస్మస్ పండగ మనం కూడా చేసుకోవచ్చా మాష్టారూ ?" అంది. శంకరం మాష్టారు ఒక్క క్షణం ఆలోచించారు. "అన్ని పండగలూ అందరం చేసుకోక పోవచ్చు. హిందువులైనా, క్రైస్తవులైనా, ముస్లిములైనా మనందరం సోదరులం. ఒకరి పండుగను మరొకరు గౌరవించుకుంటాం. శుభాకాంక్షలు తెలుపుకుంటాం. ఏ మతమైనా ఒక్కటే " అని వివరించారు. "మతం అంటే ? "ఆసక్తిగా అడిగింది అర్చన. "మతం అంటే మంచిని పెంచేది. మనిషిలో మంచితనాన్ని నింపేది "అన్నారు మాష్టారు.

"మొన్న దీపావళికి మా ఇంట్లో ఎన్ని మతాబులు, ఎన్ని కాకరపూలు కాల్చామో ! ఎన్ని టపాకాయలు పేల్చామో ! దీపావళి అంటే నాకు భలే ఇష్టం " అంది రజియా మెరిసే కళ్ళతో.

"మా ఊళ్లో పీర్ల పండగరోజు మేమంతా భేదభావం లేకుండా ఇళ్ల ముందు నిలబడి పీర్లను ఊరేగిస్తుంటే చూస్తాం. మా బంధువు ఒకాయన పులి వేషం కూడా వేస్తాడు" అంది సీత,వాళ్ల ఊళ్లో జరిగే మొహరం పండగను గుర్తు చేసుకుంటూ. ఇలా మాట్లాడుకుంటూ మేరీ టీచర్ ఇంటికి చేరుకున్నారు.

ఇంటి ముందు ముత్యాల్లాంటి ముగ్గుల మధ్య "హేపీ క్రిస్మస్" అని రాసి వుంది. రంగులతో మెరిసి పోతున్నాయి అక్షరాలు. " అబ్బ ! టీచరు ఎంత బాగా రాశారో " మళ్ళీ మళ్ళీ చదివింది అర్చన. ఆనందంతో చప్పట్లు కొట్ట బోయింది పావని. ఆమె చిన్నారి చేతుల్లోని పూల సెజ్జ జారి కింద పడింది. పువ్వులన్నీ చెల్లా చెదరుగా ముగ్గుల మీద పడ్డాయి. అన్నీ బంతి పువ్వులే ! ఎన్ని రంగులో ! ఎన్ని రకాలో !! శంకరం మాష్టారు అన్నారు " చూడండి, పిల్లలూ ! ఎన్ని రంగులున్నా ఇవన్నీ పువ్వులే! మనలో ఎన్ని మతాలున్నా మనమంతా మానవులం. మనమంతా ఒక్కటే! ఈ ముద్దబంతి పువ్వుల రంగులు వేరు కావచ్చు. వాటిలోని గుణం ఒక్కటే! అట్లాగే మతాలు కూడా".

వికసించిన మనస్సులతో పిల్లలు మేరీ టీచరుకు శుభాకాంక్షలు చెప్పారు. పిల్లలను ప్రేమగా దగ్గరకు తీసుకుంది మేరీ టీచరు. అందరికీ మిఠాయిలు పంచింది. " అమ్మాయిలూ ! మరికొద్ది రోజుల్లో సంక్రాంతి పండగ వచ్చేస్తోంది. మీ అందరికీ సంక్రాంతి శుభాకాంక్షలు ముందుగానే చెప్తున్నాను " అంది నవ్వుతూ. ముగ్గుల మధ్య రాలిన ముద్దబంతి పూలు రాబోయే సంక్రాంతి పండగను గుర్తు చేస్తున్నాయి.



# 17. సంక్రాంతి

వచ్చింది ! వచ్చింది ! సంక్రాంతి !
తెచ్చింది ! తెచ్చింది ! నవకాంతి !!
ముత్యాల ముగ్గులు
ముంగిళ్ళు నిండాయి
ముగ్గుల్లో గొబ్బిళ్ళు
ముచ్చటలు గొల్పాయి !
హరిదాసు గీతాలు
ఆనంద మందించు
బసవన్న నాట్యాలు
కనువిందు కల్గించు
పశువులకు పూజలూ
బహుశ్రద్ధతో జరుగు
భోగి మంటల వెలుగు
చూడ హర్షము కలుగు
పంటసిరులింటింట
దండిగా నిండేను
పండగల సరదాలు
ఉంచు ఆనందాలు.
వచ్చింది ! వచ్చింది ! సంక్రాంతి !
తెచ్చింది ! తెచ్చింది ! నవకాంతి !!



# 18. సహకారం

రామయ్య పొలం గట్టు మీద పెద్ద చెట్టు ఉంది. ఆ చెట్టుపై ఎన్నో పక్షులు నివసించేవి. ఒక రోజు అతడు చెట్టు కింద కూర్చొని ఉన్నాడు. అప్పుడు అతని దగ్గరకు ఒక గుడ్లగూబ వచ్చింది.

"రైతన్నా ! రైతన్నా ! రాత్రి వాన బాగా కురిసింది. ఎలుకలు కలుగుల్లో దాక్కున్నాయి. ఈ ముసురుకు ఏవీ బయటకు రావడం లేదు. ఒకటో రెండో పక్షులు తిరుగుతున్నాయి. కానీ అవీ అందడం లేదు. కాసిన్ని గింజలు పడెయ్యి" అని అడిగింది గుడ్లగూబ.

రైతు సమాధానం చెప్పలేదు. "ఆకలితో దహించుకు పోతున్నాను. కనీసం బోనులో పడ్డ ఎలుకనైనా ఇయ్యి" అంటూ గుడ్లగూబ బతిమాలింది. రైతు కళ్లెర్ర జేస్తూ "ఛీ!పో! నీ ముఖం చూస్తేనే మహాపాపం. నీ కూత కర్ణకఠోరంగా ఉంటుంది," అంటూ ఈసడించుకున్నాడు. గుడ్లగూబకు కోపం వచ్చింది.

"మిత్రమా ! ఒక రోజు ఆకలికి నీ పంచ చేరానని నీకు అలుసుగా ఉందా ! నా రూపు రేఖల్ని అసహ్యించుకుంటున్నావు కదూ ! నేనే లేకపోతే నీపని అంతే. మనం ఒకరిపై ఒకరం ఆధారపడి బతికే ప్రాణులం. నేను ఎలుకల్నీ, పురుగుల్నీ, పక్షుల్నీ తినేస్తాను. మీ పంటల్ని రక్షిస్తాను. అందుకే మీకు ఎక్కువ ధాన్యం వస్తుంది. మీరు సుఖంగా బతుకుతారు. ఇంత మాటన్నావు గదా ! నీ పొలంలోకి వస్తే ఒట్టు" అంది. తన బంధువుల్ని, స్నేహితుల్ని తీసుకొని వెళ్లిపోయింది.

'పోతే పోనీలే' అనుకున్నాడు రైతు. కానీ అతని పంట దిగుబడి బాగా తగ్గిపోయింది. అప్పుడతనికి తన తప్పు తెలిసింది. తప్పును సరిదిద్దుకోవాలనుకున్నాడు.

అతను ఆ తప్పు ఎలా సరిదిద్దుకుని ఉంటాడు ?

# 19. మహానంది

క్షేత్రం, తీర్థం అనే మాటలను మీరు విని ఉంటారు. క్షేత్రం అంటే ఏదో ఒక దైవం వెలసిన చోటు. తీర్థం అంటే నది కావచ్చు, కొలను కావచ్చు, సముద్రం కావచ్చు. వాటిలో స్నానం చేయడం పవిత్రమని ఒక నమ్మకం. సాధారణంగా చాలా క్షేత్రాలు తీర్థాల పక్కనే వెలుస్తాయి. ప్రతి క్షేత్రానికి, తీర్థానికి మహిమలు తెలిపే ఎన్నెన్నో అద్భుత కథలుంటాయి. మన రాష్ట్రంలోని మహానంది కూడా అటువంటిదే. మహానంది శివక్షేత్రం. ఇది కర్నూలు జిల్లాలో నంద్యాలకు సమీపంలో నల్లమల కొండలలో ఉంది. ఇక్కడ శివుడు వెలసిన విధానం గురించి ఒక కథ చెప్పుకుంటారు.

ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని నందుడనే రాజు పరిపాలించేవాడు. ఆయనకు ఆవుల మంద ఉండేది. రోజూ కాపరులు ఈ ఆవులను మేపడానికి అడవికి తోలుకొని పోయేవారు. ఈ మందలో ఒక కపిల గోవు ఉండేది. అది రోజూ మందనుండి విడి పోయేది. గోపాలురు ఇది గమనించి ఒక సారి దానిని వెంటాడారు.



ఆవు ఒక పుట్ట దగ్గరకు వెళ్ళి నిలబడింది. ఆవు పొదుగునుండి పాలు ధారగా పుట్ట మీదకు కారుతున్నాయి. వాళ్ళు ఆశ్చర్యపోయారు. ఈ విషయం రాజుకు తెలియజేశారు. రాజు కూడా వచ్చి చూశాడు. పుట్టకు పాలిస్తూ ఉన్న ఆవు రాజును చూసింది. బెదరి పోయింది. చక చకా అక్కడి నుండి వెళ్ళి పోవడంలో పుట్టను తొక్కేసింది. రాజుకు ఇదేమీ అర్థం కాలేదు. నగరానికి వెళ్ళిపోయాడు. ఆ రాత్రి కలలో ఆయనకు శివుడు కనిపించాడు. అడవిలో పుట్ట ఉన్న చోట తాను వెలిశానని చెప్పాడు. తనతో బాటు గంగాదేవి కూడా వెలసి ఉంటుందని, గుడి కట్టించమని చెప్పాడు. రాజు

ఉదయమే నిద్రలేచి అడవికి వెళ్ళి చూశాడు. పుట్టమీద శివలింగం ఉంది. దాని మీద ఆవు గిట్టల గుర్తులు, పాలు కారిన చారలు ఉన్నాయి. భక్తితో గుడి కట్టించాడు. ఇక్కడి శివునికి మహానందీశ్వరుడని పేరు.

ఆలయంలో అడుగు పెట్టగానే మనకు రుద్రగుండం కన్పిస్తుంది. రుద్రగుండం గట్టున ఒక నంది ఉంది. ఆ నంది నోటి నుండి నీరు గుండంలోకి నిరంతరం ప్రవహిస్తూ ఉంటుంది. ఈ నీరు స్ఫటికంలా, స్వచ్ఛంగా ఉంటుంది. నీళ్ళలో మనం చిన్నసూది వేసినా, నాణెం వేసినా స్పష్టంగా కనిపిస్తుంది. ఏ ఋతువులోనైనా ఇందులో నీటి మట్టం పెరగదు, తరగదు. ఇది ఇక్కడి విశేషం.



మహానంది - రుద్రగుండం

నంది నోటిలో చేయిపెట్టి నీరు వచ్చే విధానాన్ని మనం గమనించవచ్చు. ఇది అద్భుతం అన్పిస్తుంది. గుండంలో పిల్లలూ పెద్దలూ కేరింతలు కొడుతూ స్నానం చేస్తుంటారు. ఈ నీరు ముందుకు ప్రవహించి గుడి ముందున్న విష్ణు గుండంలోకి, బ్రహ్మ గుండంలోకి చేరుతుంది. అక్కడనుండి ఈ నీటిని పొలాలకు పారిస్తారు. రుద్ర గుండం నిర్మాణంలోని ప్రత్యేకత ఇది. ఇది కోనేరు, జలాశయం కూడా. ఈ ఏర్పాటు వల్ల మన పూర్వీకుల ఆలయ, జలాశయ నిర్మాణ కౌశలం తెలుస్తుంది.

ఏ శివాలయంలో నైనా నంది ఉంటుంది కదా! ఈ ఆలయంలోనూ ఒక నంది ఉంది. ఈ క్షేత్ర పరిసరాల్లో తొమ్మిది నందీశ్వరుల ఆలయాలు ఉన్నాయి. వీటన్నిటి కంటే ఈ గుడిలోని నంది చాలా పెద్దది. అందుకే ఈ క్షేత్రానికి ఈ పేరు వచ్చింది.

ఈ క్షేత్రాన్ని దర్శించేవారు నల్లమల అడవుల సౌందర్యాన్ని కూడా దర్శించి ఆనందిస్తారు. టేకు, ఏగిస, దేవదారు మొదలైన ఎత్తైన చెట్లు, విశాలమైన అరటి తోటలు, పచ్చని పంట పొలాలు, సెలయేళ్ళు, పిల్లకాలువలు, యాత్రికులను పరవశింపజేస్తాయి.

పిల్లలూ! మీరు మహానంది క్షేత్రాన్ని చూశారా! ఒకసారి చూడండి. విశేషాలు చెప్పండి.



# 20. రాశులు - నక్షత్రాలు

ఆ రోజు ఆదివారం. ఇల్లంతా సందడిగా ఉంది. దగ్గరి బంధువులు వచ్చారు. వేణు ఉత్సాహంగా అటు ఇటు తిరుగుతున్నాడు. ఒక వారం కిందటే అతనికి చెల్లెలు పుట్టింది. ఆమెకు పేరు పెట్టాలి. అదీ సందడి. ఇంతలో వేణు తల్లి వచ్చి "పాపకు ఏ పేరు పెట్ట మంటారు ?" అని వేణు తాతగారిని అడిగింది. "ఏముందీ! వృషభరాశిలో రోహిణీ నక్షత్రంలో పుట్టింది గదా ! రోహిణి అని పేరు పెడితే పోలా !" అన్నాడు తాతయ్య. అందరూ పేరు బాగుందన్నారు. ఆ పేరే పాపకు పెట్టారు.

ఆరోజు రాత్రి వేణు తాతయ్య దగ్గర ఆరుబయట పడుకున్నాడు. ఆకాశంలోని నక్షత్రాలను చూస్తూ తాతయ్యతో నెమ్మదిగా అన్నాడు. "చెల్లి వృషభరాశిలో రోహిణీ నక్షత్రంలో పుట్టిందన్నావు. అంటే ఏమిటి తాతయ్యా"? తాతయ్య ఆకాశం వంక చూపిస్తూ వేణుతో ఇలా చెప్పాడు. ఆకాశంలో మనకు చాలా నక్షత్రాలు కనిపిస్తున్నాయిగదా ! అవి చాలాదూరంలో ఉండటంవలన చిన్నవిగా కనిపిస్తున్నాయి. ఆ నక్షత్రాల గుండా సూర్యుడు కదులుతున్నట్లు కనపడే మార్గానికి 'రవి మార్గం' అని పేరు. ఈ మార్గంలో కొన్ని నక్షత్రాల గుంపులు ఉన్నాయి. ఆ గుంపులలో జంతువుల బొమ్మలనూ, తెలిసిన వస్తువుల బొమ్మలనూ పోల్చుకొని వాటిని నక్షత్ర రాశులు అన్నారు. ఇవి పన్నెండు.



1. మేషం
2. వృషభం
3. మిధునం
4. కర్కాటకం
5. సింహం
6. కన్య
7. తుల
8. వృశ్చికం
9. ధనుస్సు
10. మకరం
11. కుంభం
12. మీనం




వీటనే 'రాశి చక్రం' అంటారు. సూర్యుడు నెలకు ఒక్కొక్క రాశి చొప్పున పన్నెండు నెలల్లో పన్నెండు రాశులలో ప్రవేశించి మళ్ళీ మొదటి రాశిలోకి వస్తాడు. ఈ కాలాన్ని సంవత్సరం అంటారు.

రాశి చక్రంలో ముఖ్యమైన '27' నక్షత్రాలు ఉంటాయి. అవి

| | | | | |
|---|---|---|---|---|
| 1. అశ్వని | 2. భరణి | 3. కృత్తిక | 4. రోహిణి | 5. మృగశిర |
| 6. ఆరుద్ర | 7. పునర్వసు | 8. పుష్యమి | 9. ఆశ్లేష | 10. మఘ |
| 11. పుబ్బ | 12. ఉత్తర | 13. హస్త | 14. చిత్త | 15. స్వాతి |
| 16. విశాఖ | 17. అనూరాధ | 18. జ్యేష్ఠ | 19. మూల | 20. పూర్వాషాఢ |
| 21. ఉత్తరాషాఢ | 22. శ్రవణం | 23. ధనిష్ఠ | 24. శతభిషం | 25. పూర్వాభాద్ర |
| 26. ఉత్తరాభాద్ర | 27. రేవతి. | | | |

పౌర్ణమినాడు చంద్రుడు ఏ నక్షత్రంలో ఉంటే ఆ నెలకు ఆ నక్షత్ర సంబంధమైన పేరు ఉంటుంది. ఉదాహరణకు చంద్రుడు పౌర్ణమినాడు చిత్రా (చిత్త) నక్షత్రంలో ఉంటే ఆ నెలకు 'చైత్రం' అని పేరు. అలాగే వైశాఖం, జ్యేష్ఠం, ఆషాఢం, శ్రావణం, భాద్రపదం, ఆశ్వయుజం, కార్తీకం, మార్గ శిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం అని మిగిలిన పద కొండు నెలలకు పేర్లు నిర్ణయించారు. ఇది సరే. ప్రతి రోజూ ఆకాశంలోని నక్షత్రాల్ని చూస్తూ ఉండు. విశ్వం ఎంత అద్భుతమైందో ఆలోచించు !

తాతయ్య చెప్పడం ముగించాడు. తాతయ్య మాటలు వేణు ఎలా అర్థం చేసు కున్నాడో మీరు ఆలోచించండి.

# 21. సుభాషితాలు



అనువుగాని చోట అధికుల మనరాదు
కొంచె ముండు టెల్ల కొదువగాదు
కొండ అద్దమందు కొంచెమై యుండదా
విశ్వదాభిరామ ! వినురవేమ !

భావం :- అనుకూలం లేని చోట గొప్పవారమని చెప్పుకోకూడదు. చిన్నగా కన్పించటమనేది తక్కువేమీ కాదు. అద్దంలో కొండ చిన్నదిగా కన్పిస్తుంది. అంత మాత్రం చేత కొండ నిజంగా చిన్నది అవుతుందా !

అ. కింద చెప్పిన పద్యంలోని పాదానికి భావం రాయండి.

"కొంచెముండు టెల్ల కొదువగాదు"

..............................................................

ఆ. కింద చెప్పిన వాక్యాల భావాలకు సరిపడు పద్య పాదాలను రాయండి.

1. కొండ పెద్దదయినా అద్దంలో చిన్నదిగా కన్పిస్తుంది.

..............................................................

2. అనుకూలం కాని ప్రదేశంలో గొప్పవారమని ప్రవర్తించరాదు.

..............................................................



బ్రతికినన్ని నాళ్ళు ఫలములిచ్చుటెగాదు
చచ్చికూడ చీల్చి ఇచ్చు తనువు
త్యాగ భావమునకు తరువులే గురువులు
లలిత సుగుణజాల!తెలుగు బాల!

భావం:- చెట్టు జీవించి ఉన్నంతకాలం పండ్లనిస్తుంది. చనిపోయిన తర్వాత కూడా ఉపయోగ పడుతుంది. కాబట్టి త్యాగానికి చెట్లే ఆదర్శం.

అ. కింది ప్రశ్నలకు జవాబులు రాయండి.

1. చెట్లు జీవించి ఉన్నంతకాలం ఏమిస్తాయి ?
2. ఎండిన చెట్టు కూడా ఎలా ఉపయోగ పడుతుంది ?





అనగననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభి రామ ! వినురవేమ !

భావం : - పాడగా, పాడగా రాగం మరింత బాగవుతుంది. ప్రతిరోజు తినగా, తినగా చేదైన వేపాకు కూడా తియ్యగా ఉంటుంది. ప్రయత్నం చేయగా, చేయగా పనులు నెరవేరు తాయి.

ఆ. కింది పద్య పాదం భావం చెప్పండి. రాయండి.

అనగననగ రాగ మతి శయిల్లుచునుండు

.....................................................................................



ఆ. కింద చెప్పిన భావానికి పద్యంలో ఉన్న పాదం రాయండి.

తినగా, తినగా వేపాకు తీయగా ఉంటుంది.

.....................................................................................



దొరలు దోచలేరు, దొంగలెత్తుకపోరు
భ్రాతృజనము వచ్చి పంచుకోరు
విశ్వ వర్ధనంబు విద్యాధనముురా
లలిత సుగుణజాల ! తెలుగు బాల !

భావం:- విద్య అనే ధనాన్ని దొరలు దోచుకు పోలేరు. దొంగలు ఎత్తుకు పోలేరు. అన్నదమ్ములు పంచుకోలేరు. విద్యాధనము అందరి అభివృద్ధికి తోడ్పడుతుంది.

ఆ. కింది వాక్య భావానికి సమానంగా పద్యంలో గల పాదాన్ని రాయండి.

సోదరులు పంచుకోలేరు.

.....................................................................................

.....................................................



ఆ. విద్య వలన కలుగు ప్రయోజనాలను జట్లలో చర్చించండి. రాయండి.

ఇ. ఖాళీలను పూరించండి.

ఉదా: దొరలు　　దోచలేరు

దొంగలు　　...........

భ్రాతృజనం　　...........





ఎండ వెనుకె వాన నిండు హర్షము నిచ్చు
రేయి వెనుకె పగలు హాయి నిచ్చు
బాధ వెనుకె సుఖము బహుళమై వెలగురా
వాస్తవమ్ము నార్లవారి మాట.

భావం:-ఎండాకాలం తర్వాత కురిసిన వర్షం ఎంతో సంతోషాన్నిస్తుంది. రాత్రి తర్వాత వచ్చే పగలు కూడా హాయిని కల్గిస్తుంది. అలాగే కష్టాల తర్వాత కలిగే సుఖం ఎక్కువ ఆనందాన్ని ఇస్తుంది.

అ. కింది వాక్య భావానికి సమానమైన పద్య పాదాన్ని గుర్తించి రాయండి.

రాత్రి తర్వాత వచ్చే పగలు ఎంతో సంతోషాన్నిస్తుంది.

.....................................................................

ఆ. కింది పదాలకు వ్యతిరేక పదాలు రాయండి.

| | | |
|---|---|---|
| రేయి | x | .......... |
| .......... | x | అవాస్తవం |
| సుఖం | x | .......... |
| .......... | x | ముందు. |

